## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని స్క్రిబ్డ్ వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. దీనిద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంథాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) స్క్రిబ్డ్ వారి వెబ్ సైట్: https://www.scribd.com
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul



Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

స్క్రిబ్డ్ వారి వెబ్ సైట్:

http://www.scribd.com



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ధనసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్

శ్రీ సద్గురుశ్శరణమ్

# జ్ఞాన కైవల్య సిద్ధి

(గురుప్రసాదము)



గ్రంథకర్త :

"బ్రహ్మవిద్యాలంకార"

బ్రహ్మశ్రీ ముదిగొండ వేంకటరామశాస్త్రిగారు

ఓమ్

శ్రీసద్గురు శ్శరణమ్

# జ్ఞానకైవల్యసిద్ధి

## పీఠిక

ఈ భాగ్యనగరము (హైదరాబాదు)లో జ్ఞానకైవల్యసిద్ధిని రచించు భాగ్యము నాకు గల్గుటకుగల తత్పూర్వపీఠిక యప్రస్తుతము గానందున నవిస్మరణీయమగుటచే కొంచెము వివరించెద.

విజయవాడ త్రిలింగమహావిద్యాపీఠములో 18-12-1963 నుండి 9-3-1966 తేదీవఱకు నాచే గావింపబడినట్టి ఉపనిషద్బ్రహ్మ భాష్యసహిత అష్టోత్తరశత (108) ఉపనిషత్ప్రవచనముల సన్మాన సభలో ది - - 1966 తేదీని నాచే జరుపబడినట్టి-108-సువర్ణపుష్ప పాదపూజతో నానంద తుందిలాంతరంగులైనట్టి శ్రీ శ్రీ శ్రీ శృంగేరీజగద్గురు శ్రీమదభినవ విద్యాతీర్థమహాస్వామిచరణు లొసంగిన యాజ్ఞానుసారముగా ఆ త్రిలింగ మహా విద్యాపీఠములోనే 28-6-1966 నుండి 25-2-1968 తేదీ వరకు మహాసముద్రచతుష్టయ తుల్యసిద్ధిచతుష్టయ (1 బ్రహ్మసిద్ధి - 2 నైష్కర్మ్యసిద్ధి-3 ఇష్టసిద్ధి - 4 అద్వైతసిద్ధి) ప్రవచనముల నొసర్చు భాగ్యమున్న- 24-3-1968 తేదీన "సర్వతంత్రస్వతంత్ర" "చతుస్తంత్రి" బ్రహ్మశ్రీ కొల్లూరు సోమశేఖరశాస్త్రి మహోదయాధ్యక్షతతో జరిగినట్టి అస్మదీయసిద్ధిచతుష్టయప్రవచన సన్మానమహాసభానందము నొందు భాగ్యమున్నా నాకు లభించినది.

తరువాత ఈభాగ్యనగరములోని అశోకనగరములో "వదాన్య శిరోమణి" శ్రీ పల్లెంపాటి వెంకటేశ్వర్లుగారి శ్రీ సత్యనారాయణ

స్వామిదేవాలయములోని శ్రీరామకృష్ణాశ్రమములో 1-7-1981 నుండి 11-7-1981 తేదీవరకు శ్రోతల కోరికలతో నడచినట్టి అస్మదీయసిద్ధి చతుష్టయసారోపన్యాసములకు సారముగా "జ్ఞాన కైవల్యసిద్ధి" శ్లోక నవకము శ్రీసద్గురుప్రేరణతో నాహృదయమునుండి 11-7-1981 తేదీ ననే అవతరించెను.

పిదప ఈజ్ఞాన కైవల్యసిద్ధిరసికులగు— బ్రహ్మశ్రీ కందికుప్ప పార్వతీసుందరాంబా-వెంకటసుబ్రహ్మణ్యపుణ్యదంపతులకోర్కె ననుసరించి నాచే తెలుగుతాత్పర్యము 6-1-1982 తేదీన విరచితమగుటయు, ఆ పుణ్యదంపతుల భాగ్యవశమున వారిపుణ్యద్రవ్యముతో నీయమూల్యగ్రంథము ముద్రాపితమగుటయు జరిగినది. గనుక నాపుణ్య దంపతులకు శ్రీసద్గుర్వనుగ్రహమున చతుర్విధపురుషార్థసిద్ధి కలుగుగాక యనియు, జిజ్ఞాసువులీగ్రంథపఠనముతో బ్రహ్మానందము నొందుదురుగాక అనియు ఆశించుచున్నాడ.

ఓంకారమందిరావాసి
ప్రస్తుతావాసము
భాగ్యనగరాంతర్గతాశోకనగరములోని
శ్రీసత్యనారాయణస్వామి దేవాలయము
ది 14-1-1982

ఇట్లు గ్రంథకర్త
"బ్రహ్మవిద్యాలంకార"
**ముదిగొండ వేంకటరామశాస్త్రి**
శ్రీ దుర్మతిసంవత్సర
మకరసంక్రాంతి

— o —

ఓమ్

శ్రీసద్గురు శ్శరణమ్

# జ్ఞానకైవల్యసిద్ధి

"బ్రహ్మవిద్యాలంకార"

## బ్రహ్మశ్రీ ముదిగొండ వేంకటరామశాస్త్రి ప్రణీతము

(అవతరణిక)

శ్లో॥ అద్వైత-బ్రహ్మే-ష్ట-నైష్కర్మ్యాఖ్యసిద్ధిచతుష్టయే
జ్ఞానకైవల్యసిద్ధిస్స్యాత్ తురీయాతీతలక్షణా॥ 1

తాత్పర్యము:— కైవల్యమోక్ష ప్రతిపాదకములగు బ్రహ్మ నైష్కర్మ్య-ఇష్ట-అద్వైత-నామకములగు నాల్గు సిద్ధిగ్రంథముల సారముగా నీజ్ఞానకైవల్యసిద్ధి ప్రణీతమైనది. అందులో—

(1) బ్రహ్మసిద్ధి— మండనమిశ్రప్రణీతము, కాండచతుష్టయ విశిష్టము, 231 కారికలు గల ప్రౌఢాద్వైతవేదాంతగద్యప్రకరణ గ్రంథము. శంఖపాణ్యాదివిరచిత బ్రహ్మసిద్ధి వ్యాఖ్యానాద్యుప శోభితము.

(2) నైష్కర్మ్యసిద్ధి—సురేశ్వరాచార్యప్రణీతము, నాలుగధ్యాయములతో, 422 కారికలతో 1082 గద్యములతో వెలుగొందు నిష్కృష్టాద్వైతవేదాంతప్రకరణ గ్రంథము, జ్ఞానోత్తమాదివిరచిత చంద్రికాదివ్యాఖ్యోపశోభితము.

(3) ఇష్టసిద్ధి—విముక్తాత్మప్రణీతము-8 అధ్యాయములతోను, 605 కారికలతోను వెలుఁగొందు ప్రౌఢాద్వైతవేదాంతగద్యప్రకరణ ప్రబంధము, జ్ఞానోత్తమాదివిరచిత ఇష్టసిద్ధివివరణాది వ్యాఖ్యోప శోభితము.

(4) అద్వైతసిద్ధి—మధుసూదన సరస్వతీప్రణీతము, నాల్గు పరిచ్ఛేదములతోను 13 ఆద్యంతశ్లోకములతోను వెలుఁగొందు ప్రౌఢాద్వైతవేదాంత ప్రకరణగద్యప్రబంధము. గౌడబ్రహ్మానందాదివిరచిత లఘుచంద్రికాదివ్యాఖ్యోపశోభితము.

ఈసిద్ధిగ్రంథచతుష్టయములోను బ్రహ్మసత్యత్వ-జగన్మిథ్యాత్వ జీవబ్రహ్మైకత్వలక్షణాద్వైతవేదాంతపరమసిద్ధాంతమహాలక్ష్య మొక్కటియేయైనను, బ్రహ్మ-నైష్కర్మ్య-ఇష్టసిద్ధులుమూడును ప్రాచీన దార్శనికతర్క-మీమాంసాన్యాయములతో, ప్రధానప్రమేయనిరూపణ ప్రధానదృష్టితో శాంకరభాష్యముల వలె వాదకథాశాస్త్రార్థచర్చలతో నడచినవి. అద్వైతసిద్ధి యట్లుగాక నవీనతర్క-మీమాంసాప్రక్రియలతో స్వలక్ష్యలక్షణప్రణయనప్రధానదృష్టితో న్యాయామృతాదిద్వైతవాద గ్రంథఖండనదృష్టితో జల్పకథాశాస్త్రార్థచర్చలతో నడచినది.

ఇక నీయవతరణికాశ్లోకములోని "తురీయాతీతలక్షణా" అను పదమునకు స్వాభీష్టతాత్పర్యమును కొంచెము వివరించెద. అద్వైతసిద్ధికారుడు తన గ్రంథాంతములో—"సిద్ధీనా మిష్టనైష్కర్మ్యబ్రహ్మగానా మియంచిరాత్ అద్వైతసిద్ధి రధునా చతుర్థీ సముజాయత॥" అనిమూడు సిద్ధిగ్రంథముల తరువాత రచింపబడుటచే తన అద్వైతసిద్ధిని "చతుర్థీ" తురీయము అని చెప్పినట్లే ఆనాల్గుసిద్ధులకు తరువాత బయలుదేరుటచే నీజ్ఞానకైవల్యసిద్ధి తురీయాతీతమని యొకవిధముగా చెప్పనొప్పును.

అంతమాత్రమేగాక పైసిద్ధిగ్రంథములు నాల్గింటికి నానుభేద ప్రక్రియాభేదములే గాని ప్రధానప్రతిపాద్యవస్తుభేదము లేదు. ఆవస్తువు "అద్వితీయప్రత్యగభిన్నబ్రహ్మమే" అదియే జగజ్జన్మాదికారణ మగుటచే (1) "బ్రహ్మ"మనియు; షడ్భావవికారరహిత మగుటచే "(2) నైష్కర్మ్య"మనియు; నిరతిశయ సర్వప్రేమాస్పద మగుటచే "(3)ఇష్ట"మనియు; స్వగతాదిభేదత్రయరహిత మగుటచే "(4)అద్వైత" మనియు చెప్పబడినదే గాని చతుర్విధముగా చెప్పబడినట్టి ఆవస్తుస్వరూప మెద్దియని విచారించినచో "కేవలజ్ఞానమే" లేక "జ్ఞానకైవల్యమే" యని తేలును. అట్టి వివిధబాహ్యాభ్యంతరకరణవృత్త్యవభాసక మగు కేవలసత్యజ్ఞానమునే" ప్రపంచోపశమంశాంతంశివమద్వైతంచతుర్థం మన్యంతే" అనెడి మాండూక్యోక్తిననుసరించి "మాయాసంఖ్యాతురీయమె" అని శ్రీశంకరభగవత్పాదులు చెప్పినట్లు సావ్యధ్యస్తనామరూపాత్మక ప్రణవమాత్రాత్రయ మూత్రపాదత్రయ విలక్షణమగుటచే కేవలజ్ఞానమును తురీయ(చతుర్థ)మందుమే గాని వస్తుతః నిర్విశేష కేవలసత్యజ్ఞానము స్వసమానసత్తాక వస్త్వంతరశూన్యమగుటచే తనకు సద్వితీయత్వమే పొసగదు గనుక తురీయత్వము గూడ గౌణమే నని చెప్పుటకే "తురీయాతీతలక్షణా"అని చెప్పబడెను-అనెడి విశిష్ట తాత్పర్యము గూడ గలదు.

అట్టి జ్ఞానకైవల్యసిద్ధియే చిదచిద్విభాగ సదసద్విభాగప్రక్రియలతో నిరూపిత మగుచున్నది. ఆప్రక్రియతో గ్రంథాంతములోని ఏక శ్లోకిలో వివరింపబడినది.

శ్లో॥ జ్ఞానం కైవల్యసిద్ధిస్స్యాత్ జ్ఞేయో బంధ ఇతీర్యతే।
జ్ఞానం సత్యానందరూపం జ్ఞేయస్స్యాత్తద్విలక్షణః॥ 2

తాత్పర్యము – జ్ఞానమనగా తెలివియే. జ్ఞేయమనగా తెలియబడునదియే. అట్టి జ్ఞేయమే అనృతజడదుఃఖాత్మక మగుటచే బంధస్వరూప మగుననియు, జ్ఞాన మన్ననో సత్యము ఆనందస్వరూపము నగుటచే కైవల్యసిద్ధి యనబడును. అనగా–సాలోక్య–సారూప్య–సామీప్యాత్మక త్రివిధజ్ఞేయముక్తులకంటె విలక్షణము, నిరతిశయము కైవల్యముక్తియేనని గుర్తింప నగును.

శ్లో॥ ఏకం సర్వత్ర విజ్ఞానం జ్ఞేయో నానాఽవ్యవస్థితః ।
ఆద్యంతరహితం జ్ఞానం జ్ఞేయ స్త్వాద్యంతయో ర్న హి॥ 3

తాత్పర్యము– జ్ఞేయములగుస్థూల – సూక్ష్మ – కారణాత్మక– జాగ్ర–త్స్వప్న–సుషుప్తులు ఒకటి గోచరించినప్పుడు మరొకటి గోచరించదు గనుకను; ఆవిర్భావ తిరోభావములతో నవ్యవస్థితములుగా నుండును. మరియు–ఆవిర్భావమునకు పూర్వము గాని తిరోభావమునకు అనంతరము గాని గోచరించవు. జ్ఞాన మన్ననో -వివిధ విలక్షణలక్షణ లక్షితము లగు సకలజ్ఞేయములకును అవభాసకమగు ఒకేఒక చిన్మాత్ర స్వరూపముతో నావిర్భావతిరోభావరహితమై సర్వత్ర ఒకే విధముగ వెలుగొందుచుండును.

శ్లో॥ సర్వదా భాసతే జ్ఞానం మధ్యఏవహి జ్ఞేయకః ।
జ్ఞాన మాత్మేతి సుమతిః జ్ఞేయ ఆత్మేతి మందధీః॥ 4

తాత్పర్యము– వాఙ్మనోవృత్త్యాత్మకనామరూపస్వరూపనిఖిల జగజ్జాలాత్మకజ్ఞేయముయొక్క ఆవిర్భావస్థితితిరోభావములకెల్లసాక్షిగా సర్వదా ఒకేరీతిగా జ్ఞానము భాసించుచుండును. జ్ఞేయమన్ననో స్వస్థితికాలములో మాత్రమే భాసించును. ఇట్టిస్థితిలో అట్టి సత్యజ్ఞానమే–అనగాచిన్మాత్రమేఆత్మయని చిదచిద్విభాగకుశలురగు సాంఖ్య

యోగదర్శనముల వారనుచుందురు. జ్ఞేయమే ఆత్మయని చిదచిద్వివేకములేని వైశేషిక నైయాయికతర్కదర్శనముల వారందురు. ఈవిధముగా మహా వాక్యగతతత్త్వంపదవాచ్యార్థాత్మక జీవాత్మపరమాత్మలను ద్వివిధ తార్కికులున్నూ, తత్త్వంపద లక్ష్యార్థాత్మక జీవాత్మపరమాత్మలను ద్వివిధసాంఖ్యులున్నూ తత్తత్పక్షసాధకలోకోద్ధరణార్థమై నిరూ పించుచుందురు. ఔపనిషదాద్వైతవేదాంతపరమార్థసిద్ధాంతములో నన్ననో

శ్లో॥ జ్ఞాన మేవహి సర్వత్ర జ్ఞేయత్వేనా వభాసతే।
రజ్జురేవ యథాఽజ్ఞానాత్ సర్పత్వేనా వభాసతే॥ 5

తాత్పర్యము-.యాస్తికమగు జ్ఞానజ్ఞేయాత్మకచిదచిద్వివేకవిజ్ఞా నానంతరము ఔపనిషదమగు అధ్యారోపాపవాదప్రక్రియతో బ్రహ్మ విద్యాసంప్రదాయప్రవర్తకాచార్యవర్యులు సదసద్వివేకము ననుగ్ర హింతురు. అనగా- (1) సాంఖ్యపరిణామవాదప్రక్రియతో జ్ఞానము-జ్ఞేయము రెండూసత్యములా? (2) బౌద్ధక్షణికవిజ్ఞానవాదప్రక్రియతో జ్ఞానజ్ఞేయములు రెండూఅసత్యములా? (3) తార్కికారంభవాద ప్రక్రి యతో జ్ఞానమసత్యము,జ్ఞేయాత్మాదికములు సత్యములా? (4) ఔపని షదవివర్తవాదప్రక్రియతో జ్ఞేయ మసత్యము, జ్ఞాన మొక్కటియే సత్యమా?అనెడి చాతుష్కోటికసంశయముతో శ్రుతియుక్త్యనుభూతు లతో విచారించినచో నాల్గవపక్ష మొక్కటియే సిద్ధాంతితమగును- అదెట్లనగా-"సర్వంఖల్విదంబ్రహ్మ" "నేహనానాస్తి కించన" "ఆత్మై వేదంసర్వమ్" ఇత్యాదిశ్రుతులతోనురజ్జుసర్పాదిదృష్టాంతయుక్తియు క్తులతోను,"ఆత్మని చైవం విచిత్రాశ్చహి" అనెడి బ్రహ్మసూత్రోక్త సర్వసంప్రతిపన్నస్వప్నానుభూతితోనురజ్జువే సర్పముగా భాసించినట్లు పూర్వోక్తచిన్మాత్రజ్ఞానమే సర్వత్ర జాగ్రత్స్వప్నసుషుప్త్యాత్మకజ్ఞేయ

ముగా భాసించుచున్నదని ముముక్షువగు సాధకునికి బ్రహ్మవేత్త ఉప దేశించును. అపుడు—

శ్లో॥ స్యాజ్జ్ఞానం జ్ఞేయరహితం స జ్ఞేయో జ్ఞానవర్జితః
"జ్ఞానకైవల్యసిద్ధి"స్స్యాత్ తురీయాతీతలక్షణా ॥ 6

తాత్పర్యము— శుకపికాదినామరూపవికారకల్పనలు లేని పంచ దార యుండవచ్చునే గాని పంచదార లేనిపంచదారచిలుక పంచదార పికాదులుండవు. మరియు కటకకుండలాదినామరూపవికారములు లేని సువర్ణముండవచ్చునేగాని సువర్ణములేని సువర్ణకటకకుండలాదు లుండవు. అట్లే జ్ఞేయములగు-జాగ్రత్స్వప్నసుషుప్త్యాత్మకనామరూప వికారములు లేని తత్తత్సాక్షియగుజ్ఞానముచిత్సమాధిలో వెలుగొందు చుండునే గాని జ్ఞానభాస్యము గానట్టి జ్ఞేయముండదు-కనుక-"తస్మా దాద్యంతవత్త్వేన మిథ్యైవ ఖలు తే స్మృతాః"అని గౌడపాదులు చెప్పినట్లు పూర్వాపరకాలములలో లేక మధ్యకాలములో మాత్రమే భాసించెడి స్వప్నవిజ్ఞేయనామరూపవికారముల వలెనే సర్వవిజ్ఞేయ ములు తల్లక్షణలక్షితము లగుటచే మిథ్యాభూతములే-అనగా-"సత్యం చానృతంచ సత్యమభవత్"అని శ్రుతి చెప్పినట్లు ఆపేక్షికవ్యావహా రికసత్యాసత్యములన్నియు పరమార్థసత్యమగు సర్వకల్పనాధిష్ఠాన కేవలజ్ఞానమాత్రములే గనుక "జ్ఞానకైవల్యము"సిద్ధించినది.

అట్టి పరమార్థజ్ఞాన మద్వైతచిదాత్మయే గనుక ఆపేక్షికతురీ యత్వము గూడ పోనగనందున "తురీయాతీతలక్షణా"అని ఆద్యంత వాక్యైకవాక్యతతో "జ్ఞానకైవల్యసిద్ధి"సిద్ధమైనదే—

శ్లో॥ సిద్ధేపి జ్ఞానకైవల్యే జ్ఞేయో భాత్యేవహీ తిచేత్
న యథా పూర్వభానం తత్ మూలాజ్ఞానాప్రతీతితః॥ 7

తాత్పర్యము— అయ్యా! శ్రుతియుక్త్యనుభవములతో మీరు చెప్పినట్టి జ్ఞానకైవల్యసిద్ధిని బొందినట్టి జీవన్ముక్తులకు గూడ జ్ఞేయమగు పిండాండబ్రహ్మాండభావము అహం-మమాభిమానములతో కలుగుచునే యుండునుగదా? అట్టి జ్ఞేయభావమే వారికి లేనిచో శిష్య ప్రబోధ మొనర్ప వీలుకాదుగదా? కనుక జ్ఞేయరహితకేవలజ్ఞానసిద్ధాత్మక "జ్ఞానకైవల్యసిద్ధి" ఎట్లు పొసగును? అనెడి పరోక్షజ్ఞాని ప్రశ్నకు సమాధానము చెప్పబడుచున్నది—

అఖండవిజ్ఞానాత్మవిక్షేపాత్మకవిజ్ఞేయసత్యత్వభ్రమకు మూలమగు స్వాత్మాజ్ఞానము స్వాత్మాపరోక్షజ్ఞానముచే తొలగినపిదప బాధితాధ్యాసానువృత్తితో భాసించెడి పిండాండబ్రహ్మాండాత్మక ప్రపంచమంతయు అసద్భాసమానమే గనుక "జ్ఞానకైవల్యసిద్ధి" కణుమాత్రము భంగముండదు-అదెట్లనిన—

ఒక జపాకుసుమసన్నిధిలో నున్న స్ఫటికము అరుణముగా భాసించు నపుడా స్ఫటికమణిగతారుణిమ సత్యమగు తద్ధర్మమె సనెడి యజ్ఞాన మున్నదశలో ఆస్ఫటికమణిని మాణిక్య మనుకొనును. అపుడు వివేకియగు ఆప్తుడొక డాజపాకుసుమమును తొలగించి కేవలస్ఫటికమును చూపగానే అది ధవళస్ఫటికమే ననెడి సమ్యగ్దర్శనము కలుగగనే అది రక్తిమగల మాణిక్యమనే భ్రాంతితొలగును. తరువాత మరల నాజపాకుసుమసన్నిధిలో నాస్ఫటిక మరుణముగా జూపట్టినపుడు విస్మృతివలన దానిని మాణిక్యమనుకొని భ్రమించినను మరల ఆప్తుని ప్రబోధముతో నిమిత్తము లేకయే తనకే పూర్వస్మృతివలన స్ఫటికానుభూతికల్గి మాణిక్యభ్రమ తొలగును.

అట్లే-(వాస్తవికస్వచ్ఛధవళస్ఫటికమణిజ్ఞానమువలె) నిత్యశుద్ధ చిన్మాత్రాత్మజ్ఞానము (సమ్యగ్దర్శనము) సద్గురుప్రబోధమున కలిగినను

(జపాకుసుమాద్యుపాధిస్థానీయములగు) అంతరింద్రియ బహిరింద్రియో పాధు లున్నంతవరకు (జపాసన్నిధిలో స్ఫటిక మరుణముగాభాసించి నట్లు) మన అఖండచిన్మాత్రాత్మయే పిండబ్రహ్మాండములుగాభాసించి నపుడు విస్మృతివలన వాటియందు అహం-మమాభిమానములతో సత్యత్వభ్రమకల్గును. దీనినే బాధితాధ్యాసానువృత్తి యందురు. తద్భ్రమనివృత్తికితిరిగి సద్గురుప్రబోధముతో నిమిత్తము లేకయే తత్ప్రబోధ స్మృతి తనంతతనకే కల్గినంతనే -తద్వివేకప్రభావమున-అట్లుభాసించు చున్నను (స్ఫటికగతారుణిమవలె)మన అఖండచిన్మాత్రాత్మయందు భాసించు పిండాండబ్రహ్మాండములయందు సత్యత్వబుద్ధి యుండదు. అట్టి సత్యత్వబుద్ధినివృత్తికే పిండాండబ్రహ్మాండనివృత్తి యందురు. ఇది సోపాధికభ్రమనివృత్తిస్వభావము. ఇంతేగాని సమ్యగ్దర్శికి ప్రపంచభానమే యుండదనుకొనుట చాలపొరపాటు. ఈ సోపాధికభ్రమ నివృత్తిరహస్యమునే శ్రీవిద్యారణ్యులు వేదాంతపంచదశిలో-"నివృత్తఏవ యస్మాత్తే తత్సత్యత్వమతి ర్గతా ఈదృఙ్నివృత్తిరేవాత్ర బోధజా నత్వభాసనమ్॥"అని స్ఫుటీకరించిరి. కనుక స్వాత్మజ్ఞానరహితజ్ఞేయప్రపంచభానము జీవన్ముక్తుని "జ్ఞానకైవల్యసిద్ధి"కి అణుమాత్రము బాధ ముకాదని సారాంశము—

శ్లో. అజ్ఞానా ద్విస్మృతే ర్భిన్నవస్తునో వాఽన్యథా మతిః
త్రిథా పరోక్షజ్ఞానే స్యాత్ వాది స్వమ్యగవేక్షణే॥ 8

తాత్పర్యము—ఒకవస్తువు మరొకవస్తువనెడి భ్రమకల్గుటకు మూడుకారణములుండును-(1) అజ్ఞానము (2) విస్మృతి (3) అన్యవస్తుసాన్నిధ్యము. ఇందులో పరోక్షజ్ఞానికి మూడుకారణములవలన గూడ అన్యవస్తుసత్యత్వభ్రమ కల్గును. అపరోక్షజ్ఞానికి (1) అజ్ఞానముండదుగనుక (2) విస్మృతి (3) అన్యవస్తు సాన్నిధ్యములవలన అన్య

వస్తుసత్యత్వభ్రమ (బాధితార్థాధ్యాసానువృత్తి) తాత్కాలికముగా కల్గి తిరిగి గురుప్రబోధముతో నిమిత్తములేకయే తనంతట తనకే స్మృతి-వివేకములవలన నా రెండు భ్రమలు తొలగుచుండును-ఇతనికి మూలాజ్ఞానము లేదు గనుక పునర్జన్మాదులుండవు. ఇదియే జీవన్ముక్తుని వైభవము. ఏతద్వివరణము పై ఏడవ శ్లోకతాత్పర్యములో కలదు.

శ్లో॥ యథా దర్పణకైవల్యం ప్రతిబింబేపి వేదితుః
తథా జ్ఞానస్య కైవల్యం జ్ఞేయభానేపి సిద్ధ్యతి॥ 9

తాత్పర్యము—అపరోక్షజ్ఞానికి ఆరబ్ధదేహపతనపర్యంతము జీవన్ముక్తియనియు, తరువాత విదేహముక్తియనియు, గతశ్లోకములో చెప్పబడినచరిత్ర- లోకదృష్టిలో చెప్పబడినదేగాని సమ్యగ్దర్శియొక్క స్వానుభూతిలో కాదు.

స్వానుభూతిలో చెప్పవలెనన్న-ఒకపరిశుద్ధమగు నిలువుటద్దములో వివిధములగు చేతనాచేతనప్రతిబింబములు గోచరించుచున్నప్పుడు గూడ వివేకదృష్టిలో విశుద్ధదర్పణముగానే వెలుగొందుచుండునట్లు అనంతకోటిపిండాండబ్రహ్మాండములు తన నిత్యశుద్ధాద్వితీయాఖండ చిదాత్మయందు స్వప్నదృశ్యములువలె గోచరించుచున్నప్పుడు గూడ మహాసముద్రములో బుద్బుదములవలె భాసించుచున్నపుడుగూడ వివేకియగు సమ్యగ్దర్శిస్వదృష్టిలో సర్వదా సర్వత్ర అద్వితీయాఖండ పరిపూర్ణ నిత్యశుద్ధబుద్ధముక్తాత్మస్వరూపుడై జ్ఞానకైవల్యసిద్ధిస్వరూపుడై వెలుగొందుచుండును.

ఇందలి వాదోపవాదసిద్ధాంతముల నెరుగవలెననెడి కుతూహలము గలవారలు అస్మదీయవేదాంతసర్వస్వములోని III-౧౬ ప్రకరణమును పరిశీలింతురుగాక.

పర్యవసానములో "జ్ఞానకైవల్యసిద్ధిస్స్యాత్" అనెడి యుపక్రమవాక్యమునకు "తథాజ్ఞానస్యకైవల్యం" అనెడి యుపసంహారవాక్యముతో నేకవాక్యతను గుర్తించే ముముక్షువులెల్లరు శ్రీసద్గుర్వనుగ్రహమున జ్ఞానకైవల్యసిద్ధి నధిగమించి బ్రహ్మానందస్వరూపులై కృతకృత్యులగుదురుగాక—

| | |
|---|---|
| ఓంకారమందిరనివాసి<br>ప్రస్తుతావాసము<br>భాగ్యనగరాంతర్గతాశోకనగరములోని<br>శ్రీసత్యనారాయణస్వామి దేవాలయస్థుడు<br>ది 6–1–1982 | ఇట్లు<br>"బ్రహ్మవిద్యాలంకార"<br>ముదిగొండ వేంకటరామశాస్త్రి<br>శ్రీ దుర్మతిసంవత్సర<br>వైకుంఠైకాదశీ బుధవారము. |

# —• ఏకశ్లోకి •—

శ్లో॥ జ్ఞేయో దృగ్దృశ్యయో ర్భేదః తత స్సదసదాత్మతా
స్వానుభూత్యాతు చిన్మాత్రం జ్ఞానకైవల్య మేవహి॥

తాత్పర్యము—ఈశ్లోకములో జ్ఞానకైవల్యసిద్ధిసాధనక్రమము, జ్ఞానకైవల్యసిద్ధిసారాంశము కూడకలదు.

అదెట్లనగా—తీవ్రముముక్షుగల సాధకుడు సద్గురుకటాక్షమున మున్ముందు చిదచిద్వివేకము నధిగమించవలెను-అనగా సర్వత్ర (1) దృక్కు-(తెలివి) (2) దృశ్యము(తెలియబడునది) రెండే పదార్థములు కలవని గుర్తించవలెను. ఐతే- తెలియబడు త్రిగుణాత్మకపదార్థముల లోని తారతమ్యములు బుభుక్షువునకును, ముముక్షుసాధకునకును అపేక్షితము లగునేగాని తీవ్రముముక్షువునకవి యణుమాత్రముగూడ గుర్తుండరాదు.

తరువాత నారెంటిలో-దృక్కు-(జ్ఞానము)మాత్రమే సత్యమనియు, దృశ్యము (జ్ఞేయము) సర్వము స్వప్నదృశ్యమువలె అసత్యమనియు గుర్తించవలెను.

ఈరెండుసాధనములనే మహావాక్యములోని వాచ్యార్థనిరాకరణము, లక్ష్యార్థాధిగమ మని పెద్దలు చెప్పెదరు.

అట్టిస్థితిలో—అసత్యము దృశ్యమునగు జ్ఞేయము స్వప్నమువలె లేనిదేగనుక, సత్యము దృగ్రూప మగుకేవలజ్ఞానమె తన అద్వితీ

యాఖండబ్రహ్మాత్మస్వరూపమై సర్వత్ర సర్వదా వెలుగొందుచుం డును. ఇదియే జ్ఞానకైవల్యసిద్ధిసారాంశము—

"దుర్లభో విషయత్యాగః దుర్లభం వస్తుదర్శనమ్।
దుర్లభా సహజావస్థా। సద్గురోః కరుణాం వినా॥"

సర్వం శ్రీసద్గురుచరణారవిందార్పణమస్తు.

ఇట్లు,
"బ్రహ్మవిద్యాలంకార"
ముదిగొండ వేంకటరామశాస్త్రి
ది 14—1—1982

---

షరా— ఈ "ఏకశ్లోకి"—21-8-1981 తేదీరాత్రి 12 గం॥ సమయములో హైదరాబాదునుండి—నెల్లూరుకు వెళ్లే ట్రయినులో శ్రీసద్గురుప్రేరణతో నాహృదయమునుండి ఆవిర్భవించినది.